# శుకవాణి

కం॥ హరిభక్తిచేతఁ గొందఱు
దరివార్తురు మొదలు ముట్టఁ దాపంబుల ని
ష్ఠురతర కరముల సూర్యుం
డరుదుగ దెనుమంచు పీచమణచినభంగిన్
6-53.



సంస్థాపకులు: సద్గురు
శ్రీరామకృష్ణానందస్వాములవారు

సంపుటి 12 సంచిక 2

' తుమ రక్షక కాహూంకూ డరనా''

[నాకు రక్షకుడవు - నా కేమి భయము?].

— హనుమాన్‌చాలీసా.



సంరక్షకుడు :

**గండి శ్రీ వీరాంజనేయస్వామివారు.**

"కృష్ణాయ వాసుదేవాయ - దేవకీనందనాయ చ ।
నందగోప కుమారాయ - గోవిందాయ నమోనమః ॥"

# భక్తవాణి

(భాగవత తత్త్వ సందేశ మాసపత్రిక.)

సంపుటి 12 ★ ఫిబ్రవరి 1997 ★ సంచిక 2

సంరక్షకులు :

శ్రీ గండి వీరాంజనేయస్వామివారు

సంస్థాపకులు :

బ్రహ్మీభూత సద్గురు శ్రీ రామకృష్ణానందస్వాములవారు

సంపాదకురాలు :

మాతా ప్రతిభానందగిరివారు

కార్యదర్శి :

సాధు సుబ్బరాయుడు

మేనేజరు :

శ్రీ భూమానందాశ్రమం - గండిక్షేత్రం,
వీరన్నగట్టుపల్లె పోస్టు - కడపజిల్లా 516 329.

| వార్షిక చందా రు. 40–00 |
|---|

ఓమ్

# విషయసూచిక



## పంచాంగము

ఫిబ్రవరి 1997

3 గురుమౌఢ్య త్యాగం
4 వైష్ణవైకాదశి
5 ధనిష్ఠకార్తె తె. 5-55
6 మాసశివరాత్రి
7 అమావాస్య
9 చంద్రదర్శనం
12 కుంభసంక్రమణము
14 రథసప్తమి, భీష్మాష్టమి
17 భీష్మ ఏకాదశి
22 వ్యాసపూర్ణిమ
28 శుక్రమౌఢ్య ప్రారంభం



## 'ఓం' భగవన్నామ సంకీర్తన

రచన: పి. సుబ్బయ్య, కడప.

కేశవ మాధవ — గోవిందా!
శ్రీనివాసా — గోవిందా!
తిరుమలవాసా — గోవిందా!
శ్రీ వేంకటేశా — గోవిందా!
శేషగిరీశా — గోవిందా!
శేషశయనా — గోవిందా!
భక్త పోషకా — గోవిందా!
భక్త వరదా — గోవిందా!
సురసంసేవిత — గోవిందా!
సురమునివందిత – గోవిందా!
ఆపద్బాంధవ — గోవిందా!
ఆదిదేవా — గోవిందా!



ఓం

# భాగవత గంగ

## [ శ్రీ సద్గురు ఉవాచ ]

ఆత్మీయ బంధువులారా ! అవధరించండి.

మన భాగవత యాత్రా స్పెషల్ ట్రైన్ పంచమ స్కంధంలోని జడ భరతోపాఖ్యానం నుండి కదిలింది. షష్ఠ స్కంధంలోని నారాయణ కవచంలోకి చేరుకొంటూ వుంది.



భరత రహూగణ సంవాదందాటేసింది. అజామీళోపాఖ్యానం మరోసారి అనింది. శబళాశ్వుల బోధ ప్రక్కకు పెట్టింది. వృత్రాసురుని కథలోకి ప్రవేశిస్తూ - యిదో నారాయణ కవచం చూపులోకి తెచ్చింది.

పంచమ స్కంధంలోని భరతోపాఖ్యానం - షష్ఠ స్కంధంలోని నారాయణకవచం. ఈ మధ్యలో కొన్ని తెల్సుకోవలసిన అంశాలున్నాయి. సింధు సౌవీర దేశాధీశ్వరుడు రహూగణ చక్రవర్తి బ్రహ్మజ్ఞానాపేక్షతో కపిలాచార్యుని సన్నిధికి పల్లకినెక్కి వెళ్ళుతూ మధ్యలో తెలియక బ్రహ్మ

జ్ఞానియైన జడభరతుని అవమానంచేశాడు. తెలియనితనంతో చేసింది కాబట్టి చప్పున తెప్పరిల్లుకొన్నాడు. పశ్చాత్తాపపడ్డాడు. నిష్కృతి లభించింది. ఆశీర్వాదం దొరికింది. అభీష్టసిద్ధి కలిగింది.

ఇక దేవేంద్రుని విషయం అలాకాదు. తెలిసి తెలిసి ఐశ్వర్య మదంతో చూస్తూ చూస్తూ గురువును అనాదరణ చేశాడు. దాని దుష్ఫలితాన్ని అసలు వడ్డీతో అనుభవించాడు.

జడభరతునిది అతిచేతనావస్థ. "చంపగా వచ్చినవారి యందు కరవాలమునందును కాళియందు దానచ్యుతభావము నుంచిన" దివ్య చైతన్య భూమిక ఆయనది. రహూగణ చక్రవర్తి సుశిక్షితుడే, జ్ఞానాసక్తుడే. కపిలుని వద్దకు దీక్షా పేక్షతో వెళ్ళుచున్నాడు. నాటి వాహనం పల్లకి. దాన్ని నలు గురు బోయీలు మోస్తారు. మధ్యలో కనబడిన జడభరతుని ఈ బోయీలు పట్టి తెచ్చి భుజాన పెట్టి పల్లకి మోయించారు.

ప్రభువుకంటే ప్రభువు నాశ్రయించి బ్రతికే వాళ్ళ ప్రతాపం జాస్తి. ఎందుకంటే ఎండతో కాగినయిసుక పరమ దారుణంగా వుంటుంది. కొత్త మనిషి పల్లకి మోయడంతో రాజుగారికి క్లేశం కలిగింది. "నొచ్చియును కీడు బల్కని"-

ఈ సూక్తి అందరి సొత్తుకాదు. రాజు సజ్జనుడే సంస్కార వంతుడే. ఎంతైనా రాజే కదా! పింగళి సూరన చెప్పనే చెప్పాడు.

"అదియునుగాక - రాజ్యమను మహా భూతంబు
బూనెనేని యెట్టి వానికైన
లేని గ్రుడ్డితనంబు లేని మూగతనంబు
లేని చెవుడు కొంతయైన గల్గు."

"ఎవడురా వాడు! జీవచ్ఛవమా! అరే! నడపీనుగా కండ్లు పెట్టుకొని నడు. నేనెవరో తెలుసా? నీ వక్రగమనాలను విడిపిస్తాను సుమా!" అని రాజపుంగవుడు ఐశ్వర్య మదోన్మాదుడై ఏమేమో వాగుతున్నాడు.

చావుబ్రతుకులే సమానంగా చూచిన భరతునికి రాజు మాటలతో వచ్చే మానంగాని అవమానంగాని ఏమీ లేదు. "అయినా తనదగ్గరకు వచ్చి తన్ను దర్శించికూడా, స్మరించికూడా తేరకు నరకకూపంలో పడిపోతాడే" అని ఆయనకు జాలి.

"మహారాజా! చావకముందే నలుగురితో మోయించుకుంటున్నావే - మరి, జీవచ్ఛవము - బ్రతికియున్న పీనుగు నీవా నేనా? కాస్త యోచించి మాట్లాడు. నన్ను నీవు శిక్షి

స్తావా? అసలుకు - నేనంటే ఎవరో నీకు తెలుసా? జడమైన శరీరమా నేను? శరీరాన్ని శిక్షిస్తే నాకు వచ్చిన హాని ఏమీ లేదు. నన్ను(ఆత్మను)నీవు శిక్షించలేవు. నీ మాటలు నిరర్థక ప్రసంగాలు. రాజుగారికి తలతిరిగింది. పైనవుండే రాజు క్రిందికి దుమికాడు. పాదాలపై పడ్డాడు. "వినామహత్పాద రజోభిషేకం" "ఎరుగక జేసితి కరుణజూప" మని క్షమాపణ కోరుకున్నాడు. చెంపలు వేసుకొన్నాడు. జ్ఞాన ప్రసాదానికి పాత్రుడైనాడు.

మా శంకరానందస్వాములవారు ఒక కథ చెప్పే వారు. అత్తగారు కోడలుతో అనింది. "అమ్మా! పని బడింది వూరికి వెళ్ళివస్తాను. నీకు ఉదయమే కాఫీ త్రాగే అలవాటు పనివాండ్లు అంత తొందరగారారు. ఆవును పితుక్కునేది నీకు తెలుసా ?"

గ్రాడ్యుయేట్ కోడలు అనింది. "తెలియకేమి ?" తెలియదంటే అవమానంకదా? అత్తగారు వెళ్ళింది. ఎప్పుడూ కుర్చీలుపై - పైన కూర్చునే కోడలుగారు పశువు పాదాలదగ్గర యెలా కూర్చోడం? నాన్‌సెన్స్? పైన యెక్కి కూర్చుంది. పైన కూర్చుంటే పాలొస్తాయా? రాజుగారికి అభిమానం తొలిగింది, జ్ఞానము కలిగింది.

ప్రస్తుతము మన ఘట్టానికి సంబంధించిన విషయం లోకి వస్తాము. ఇది ఆరవస్కంధం. అజామిళుని కథ, శబళాశ్వల సంగతి మొదట్లోనేవస్తాయి. వాటిలోకి నేనిప్పుడు దిగదలచుకోలేదు. సమయ సందర్భాలను చూచుకొని ఆ విషయాలను ముమ్ముందు బైటవేస్తాము.

దేవేంద్రుడు ఒడ్డోలగంలో శచీసమేతుడై సింహాసనాన్ని అధిష్ఠించియున్నాడు. ఐశ్వర్య అధికారం అంగనా సన్నిహితం ఆయనను ఉన్మత్తుని చేసింది. సుభాషితకారుడు అంటాడు.

శ్లో॥ మదనో మర్కటో, మత్స్యో మానినీ మదిరా మరుత్,
మా మనో మధుపో మేఘో, మకారా దశ చంచలాః ॥

ఈ పది మకారాలు స్వయంగా చంచలాలు; చంచలునిగా కూడా చేస్తాయి. (1) మదనుడు. (2) మర్కటము. (3) మత్స్యము. (చేప) (4) మానిని. (స్త్రీ) (5) మదిర (మద్యం) (6) మరుత్ (గాలి) (7) మా (లక్ష్మి) (8) మనస్సు. (9) మధుపము (ఈగ) (10) మేఘము.

దేవేంద్రునికి ఇందులో రెండో మూడో ఆవేశించి వుంటాయి. గురువుగారు బృహస్పతి సభలో ప్రవేశించారు. లేవడమూ, ఎదురేగడమూ, ఆదరించడమూ, ఎందుకో!

అవమానం అనుకున్నాడేమో? చూచీచూడనట్లు కపట నాటకం ఆడాడు. బృహస్పతికి తెలియదా? "చనువించని లేనిచోట మనుజునకు నిలువదగదు" సుమతీ బోధను ఆచార్యుడు అనుసరించాడు. వెనక్కు వెళ్ళాడు. అంతర్ధానుడైనాడు. శతక్రతుడు గుర్రుక్క తిప్పుకున్నాడు. పుణ్యం చేసినవాడు కదా! ఏమైనా శతక్రతువు కదా! నూరు యజ్ఞాలు చేసిన పుణ్యం ఊరకపోతుందా? "శత" "క్రతు" లో మొదటి రెండక్షరాలు తీసుకొని "శక్ర" అని అంటాము. శక్రుడన్నా, శతక్రతువన్నా దేవేంద్రునికి పేర్లు.

ఈ సంక్షిప్త భాష ఆనాడు కూడా వుండింది. గోపరాజు రామచంద్రరావును "గోరా" అంటాము. వావిలకొలను సుబ్బారావుగారిని "వాసుదాసు" అంటాము. మహేంద్రనాథగుప్తను "మా" అంటాము.

సరి, దేవతలకు గురుబలం పోయింది. బృహస్పతి బుద్ధికి దేవత.బుద్ధికి పరాభవం, జీవితానికిపతనం. దేవేంద్రుడు ఎంత గాలించినా బృహస్పతి దొరకలేదు. ఆ అదును చూచుకొని రాక్షసులు దేవతలపై దండెత్తారు. దేవేంద్రాదులు దిక్కుతోచక వేల్పుల పెద్ద చతుర్ముఖ బ్రహ్మను శరణుజొచ్చి తమపరిస్థితిని విన్నవించుకొన్నారు. బ్రహ్మకూడ గురు తిరస్కారానికి ఒడిగట్టిన దేవేంద్రుని ఛీకొట్టి "త్వష్ట ప్రజాపతి కుమారుడైన విశ్వరూపుని ఆశ్రయించి అతన్ని

గురువును చేసుకొని శక్తివంతుడై శత్రువును నిర్జించండని ఆదేశించాడు. వారు కూడా ఆ విధంగానే విశ్వరూపుని సన్నిధికి వెళ్ళి అనునయవినయములతో ఆయన వలన "నారాయణకవచ" విద్యను సంపాదించి రాక్షసజయము పొందారు. ఆ విద్యనే "వైష్ణవీ విద్య" అని కూడా అంటారు.

సంస్కృతంలో ఈ కవచసాహిత్యం ఒక విశిష్టస్థానం పొందివుంది. కావ్యధోరణి అధ్యాత్మతత్త్వము ఈ రెంటి యొక్క విరళ సంయోగము నారాయణ కవచము. స్కాంద పురాణములో శివకవచము, మార్కండేయపురాణంలో దేవీ కవచము ప్రసిద్ధాలు. గణేశపురాణంలోని గణేశకవచము, బ్రహ్మయామళతంత్రములోని సూర్యకవచం కూడా పంచాయతనపూజ చేసేవారు అనగా పంచదేవతోపాసకులు భక్తి శ్రద్ధలతో పఠిస్తూ వుంటారు. ఈ నారాయణకవచంయొక్క విస్తారము వివరణము అనుష్ఠానపద్ధతి "కల్యాణ" పత్రికవారి "విష్ణు" అంకంలో ప్రకటించినారు. సంస్కృతంలో భాగవత టీకాల్లో వంశీధరుడు తన భావార్థ దీపికా ప్రకాశంలోనూ యీ వివరణను యిచ్చాడు.

ఈ నారాయణ కవచం ప్రత్యేక గ్రంథరూపంగా తయారై వుండడంవల్ల ఇచ్చట ప్రకటించలేదు!



శ్రీ గురుదేవాయ నమః

# శ్రీ భాగవతీయ ప్రవచనము - 57

మూలం : శ్రీరామచంద్రడోంగ్రే మహారాజ్ వారు.

అనువాదం: పూజ్యశ్రీ విద్యాస్వరూపానందగిరిస్వాములవారు.

మానవ జీవితం అతిశయ విలాసమయమై పోయింది. ప్రజలలో సంయమనం, సదాచారం, భగవద్భక్తి పెరిగినపుడే (పెరిగితేనే) మహాత్ములు జన్మిస్తారు. విలాసవంతులైన తలిదండ్రుల ఇంటిలో మహాత్ములు జన్మించరు. మహాత్ముడు సత్పురుషుడు జన్మించడం కోసం మంచిచోటును మంచి స్థానాన్ని వెదుకుతాడు.

పవిత్రుడైన బ్రాహ్మణుని ఇంటిలో భరతుడు జన్మించాడు. భరతునికి ఇది ఆఖరుజన్మ. తాను లేడిపిల్ల మాయలో పడినందువల్ల తనకు జంతుదేహాన్ని ధరించాల్సి వచ్చిందని అతనికి పూర్వజన్మ జ్ఞానం కలిగింది. అంచేత ఈ జన్మలో ఎవరితోను మమకారం కలిగివుండకూడదని, మాటలాడనుకూడ మాటలాడ కూడదని, మరల గతంలోవలె తప్పు చేయక సావధానంగా వుండాలని నిర్ణయించుకున్నాడు. ఎవరితోను మాటలాడడం మానేశాడు - బాల్యమందే భక్తిలో కలసిపోయాడు.

శాస్త్రం ఆఖరుజన్మయొక్క కొన్నిలక్షణాలను ఇలా చెప్పింది - ఎవరిపై బాల్యావస్థయందే భక్తి ప్రభావం పడిందో అతనిది ఆఖరుజన్మ అని తెలుసుకో. ఎవనిబుద్ధి

కామాన్ని వదిలిందో అతనికి కూడ ఇది ఆఖరుజన్మే. ఎంత వరకు బుద్ధియందు కామముందో అంతవరకు అతను మరల జన్మించడం మిగిలివుందని తెలుసుకో. ప్రతియొక వస్తువు నందు ఎవడు భగవంతుని దర్శిస్తాడో అతనికిది అన్తిమ జన్మయే. ఎక్కడైన సరే చూపుపడితే అక్కడంతా భగవంతుడు కనిపిస్తే అతనికిది అంతిమజన్మ. హృదయంలో అభిమానం లేనివానికి, దీనభావం లేనివానికిన్ని అది అంతిమ జన్మయె.

ఒకడు నవ్వుతూ బద్ధుడైతే మరొకడు ఏడుస్తూ బద్ధుడౌతాడు. సామాన్య జీవుడు వాసనల కధీనుడై (వశుడై) ప్రపంచంలోనికి వస్తే, సాధుమహాత్ముడు భగవంతుని సంకల్పంతో భగవంతుని కార్యంకోసరం ప్రపంచంలో పుట్టు తాడు. ఇతరుల ధనాన్ని ఇతరుల మనస్సును ఆకర్షించే వ్యక్తి ప్రాపంచిక దృష్టిలో చతురుడు కానీ ఈ కళ ఒక సామాన్య స్త్రీకి కూడ సహజంగా కల్గినదై వుంది. ప్రాపంచిక దృష్టిలో మహాత్ముడు జడుడు. కానీ ఆనందమయ చైతన్యమైన భగవంతుణ్ణి మరచిపోయి సాంసారిక సుఖాలల్లో దిగు బడిపోయిన కూరుకుపోయిన మానవుడు నిజంగా జడుడు, భగవంతుని భక్తిలో మగ్నుడై దేహభావనయేలేని - దేహ ముందనే తెలియని మహాత్ముని జడుడని ఎలా చెప్పేది? కానీ ప్రపంచముయొక్క విపరీత అభిప్రాయం వలన ప్రాపంచిక జనం భరతునికి జడభరతుడని పేరుపెట్టారు,

ప్రజలు భరతుణ్ణి మూర్ఖుడని తలచుతూంటే, భరతు డాలోచిస్తున్నాడు. ప్రజలునన్ను మూర్ఖుడనుకుంటే అందులో చెడ్డేముంది - తప్పేముంది? గతజన్మలో జ్ఞానాన్ని ప్రదర్శించ పోయి దుఃఖఅయ్యాను. జ్ఞానము యితరుల కుపదేశించ డానికి కాదు, మరేమంటే భగవదారాధనకోసం వుండేది. జగద్గురు శ్రీ శంకరాచార్యులవారు చెప్పారు - "విదుషాం యచ్ఛవైదుష్యం ముక్తయే న తు భుక్తయే" జ్ఞానుల జ్ఞానం ముక్తికోసరం, భుక్తికోసం కాదు" అని.

జ్ఞానం ధనాన్ని పేరుప్రతిష్ఠలను సంపాదించడం కోసరం కాదు, పరమాత్మను పొందడానికి వుండేది - జ్ఞానం యొక్క ఫలం ధనము మరియు ప్రతిష్ఠ కాదు; మరేమంటే పరమేశ్వరుడు పరమాత్మతో ఏకం కావడానికే జ్ఞానం.

జడభరతుడు ఆలోచించాడు - గతజన్మంలో జంతువుతో వాగ్వ్యవహారం. మాట్లాడడం నిర్వహించాను-చేశాను కాబట్టి పశువు (జంతువు) యొక్క అవతారం - జన్మలభిం చింది. కాబట్టి ఈ జన్మలో నేను ఎవరితోను మాట్లాడను. ఒకవేళ మాట్లాడవలసివస్తే భగవంతునితో మాట్లాడుతా వాక్కును, నీటిని దురుపయోగం చేసేవాడు ఈశ్వరుని అప రాధి. అంత్యకాలంలో వాక్కు అతనికి విశ్వాస ఘాతకం చేస్తుంది.

మీరాబాయి కూడా - మాట్లాడితే కేవలం నా గిరి

ధర గోపాలుడు శ్రీకృష్ణునితోటే మాట్లాడుతా. నేను గిరిధరగోపాలునే స్తుతిస్తా. ప్రాపంచిక జనాలను; లేక బంధువులను స్తుతిస్తే లాభమేమిటి అని నిశ్చయించి యుండినది.

"రామనామ మేరే మన బసి హౌ, రామరసియో రఘూ ఊరే మామ్" జడభరతుడు ఎవ్వరితోను మాట్లాడేవాడు కాడు. ఎక్కువగా మాట్లాడడంచేత స్నేహం కలుగుతుంది. ఈ సృష్టిలో భగవంతుడు ఒక్కొక్కపనికి రెండేసి ఇంద్రియాల నిచ్చాడు. ఒకకన్నుతో చూడవచ్చు, అయినా రెండు కండ్లనిచ్చాడు. కానీ ఒకే నాలుకకు రెండు పనులు మాట్లాడడం, భుజించడం - చేయువలసి వస్తుంది. అంచేత నాలుక మీద ఎక్కువ అదుపు (అంకుశం) వుంచవలసివుంది. ఇతరులతో మాట్లాడడంవలన, ప్రేమించడం వలన వాసన వుత్పన్నమవుతుంది. దానివలన కొత్తప్రారబ్ధం వుత్పన్నమవుతుంది. దానివలన రెండోమారు జన్మించాల్సి వస్తుంది. జడభరతుడు అన్నివిధాల మనస్సుపై అదుపును వుంచుతున్నాడు. నీకు నీవే స్వయంగా మనస్సుపై అంకుశముంచాలి. నీ మనస్సును పరొకడెవడు నియంత్రణ చేయగలడు!

జడభరతుని తండ్రి - నా కుమారుడు చదువుకొని పణ్డితుడవుతాడు - అని తలంచి అతనిని చదివించసాగాడు, కానీ జడభరతుని పాణ్డిత్యం విలక్షణంగా వుండినది. ఇతని పాణ్డిత్యం నిజమైనది. నిజమైన పాణ్డిత్యం ఏది। "పరధన

పరమస పారసకూ, వేశ్యాబషీ ప్రవీన్, తులసీ సో ఈ చతురతా రాము చరనల వలీన''

జడభరతునికి అంతా తెలుసు, అయినా మన్త్రోచ్చారణ సరైన పద్ధతిలో చేసేవాడు కాదు. ఆయన తన జ్ఞానాన్ని ప్రసిద్ధం చేసుకోడానికి యిష్టపడడం లేదు. ఆయన భగవంతుని స్మరణలోనే లీనమై యుండేవాడు. జ్ఞానం మరియు పరిపక్వమైనపుడే జీవుడు - పండు పక్వమైనపుడు చెట్టునుండి తనకు తాను వేరై ఊడి పడిపోవునట్లు; తానున్న సంసారవృక్షం నుండి వేరవుతాడు.

తలిదండ్రులు చనిపోయిన తర్వాత జడభరతుడు పిచ్చివానివలె తిరగడం మొదలెట్టాడు. చూచేవారికి ఆయన పిచ్చివానివలె కనిపించేవాడు, కానీ ఒక్క క్షణంకూడ శ్రీకృష్ణుని మరచేవాడు కాడు. భోజనం ఏ విధంగా చేయాలి అని జడభరతుడు చెప్పాడు - రుచిని ఆపేక్షించకుండా కేవలం శరీర పోషణ కొరకమే భోజనం చేయాలి. జడభరతుని సోదరులు నువ్వులపిండి (నూనె ఆడి తీసేసినపిండి) ధాన్యపుతవుడు, కుళ్ళిన వృద్ధులు (మినుములు) మొదలైనది భరతునికి తినే దానికి ఆహారంగా ఇస్తూండేవారు. అయినా భరతుడా వస్తువులనుకూడ అమృతంతో సమానంగా తలంచి తింటూండేవాడు.

ఏ విధంగా నడవాలి అనే విషయంకూడ జడభరతుడు చెప్పాడు (చూపాడు). ఏ ప్రాణికి హింస కలుగకుండా వుండునట్లు దారి చూచుకొని ఆయన నడుస్తూ వుండేవాడు. భూమిపై (క్రింద) చూపునుంచి దారిలో నడువాలి. నావలన ఏ ప్రాణికీ హింస కలుగకుండు గాక! అని ఆలోచించు.

భరతుడు ఇతరుల పనులనుకూడ చేసేవాడు. భరతుని సోదరులు అతనిని పొలం నలువైపుల మట్టి ప్రహరీని పెట్టమని చెప్పారు, భరతుడాలోచించాడు - నేనీ రోజు వారుచెప్పిన పని చెప్పినట్లు చేస్తే మరల రేపు మరోపని చెప్తారు, అంచేత ప్రహరీకి బదులు పొలం నలువైపుల గోయ్యితీసి పెట్టాడు. ఒకరోజు సోదరులు భరతుని పొలంలో పైరుకు కావలి వుండమంటే పొలంలో ఆవులను మేసేదానికి వదలిపెట్టాడు, భరతుడు ఆవులను అడ్డగించేవాడుకాడు. ఆయన అంటూవుండే వాడు - ఖానే వాలా రామ్, ఖిలానేవాలా రామ్, తోరో కినేశా క్యాకామ్" తినేవాడు రాముడు, తినిపించేవాడు రాముడు. అలాంటపుడు అడ్డగించాల్సిన పనేముంది" అని.

ప్రపంచమందు ఆయన నటించేవాడు తాను పిచ్చి వాడినని. జ్ఞానులకు లోకసంగ్రహం ధ్యానంలో బాధకము. ప్రాపంచిక వ్యవహారపు మాయ అంటుకోకుండా వుండుగాక అనే కారణంవలన ఆయన భగవద్ధ్యానంచేస్తూ ఒకరోజు పొలంలో కూర్చొని వుండినాడు.

ఒక కొండజాతి (భిల్లులు అనే జాతి) రాజుకు సంతానం లేకుండెను. అతను తనకు సంతానం కలిగితే భద్రకాళికి నరబలి యిస్తానని మొక్కుకొని వుండినాడు. అతనికి కొడుకుపుట్టాడు. రాజు ఒక మానవుణ్ణి బలికోసరం తీసుకురమ్మని భటుల నాజ్ఞాపించాడు. రాజభటులు అందుకోసరం తిరుగుతూ పొలంలో వున్న జడభరతుణ్ణి చూశారు. ఆలోచించారు - ఇతను బాగున్నాడు, హృష్ట పుష్టంగాకూడ వున్నాడు. కాబట్టి ఇతన్ని పట్టుకపోదాం - అని ప్రపంచం దృష్టిలో సాధు మహాత్ముడు పిచ్చివాడు సాధుమహాత్ముని దృష్టిలో ప్రాపంచిక సుఖాలలో తగుల్కొనియున్న జనులు పిచ్చివాళ్ళు. ఈ భిల్లు రాజసేవకులుకూడ భరతుణ్ణి పిచ్చివానిగా తలంచారు. అతనిని పట్టుకొని భద్రకాళి గుడికి తీసుకపోయారు.

దేవికి బలిదానమివ్వు, కాని ఏ ఒక ప్రాణిని కాదు. కామం క్రోధం, లోభం మొదలైన దుర్గుణాలే పశువులు - జంతువులు వానిని బలిదానమివ్వు. దేవీ భాగవతంలో బలిదానానికి ఇదే అర్థం చెప్పబడింది.

భరతునికి స్నానం చేయించారు. పూలమాలవేశారు. భోజనానికి మంచి పిండివంటలు తినిపించారు. భోజనం చేయడం పాపంకాదు, కానీ స్వాదిష్టంగా భోజనం కావాలని భుజించడం పాపం. భోజనం సాధనం, భగవద్భజన సాధ్యం. భరతుడు భోజనం చేసేవాడు, కానీ ఆయన భుజించడం

భగవద్భజన కోసరం. భిల్లుడు ఆలోచించాడు, - ఇతనిని రెండు గంటల తరువాత చంపాలి - నరకాలి. అయినా ఇతను చాల సుఖంగా భుజిస్తున్నాడే. భోజనం తరువాత భరతుణ్ణి గుడిలోనికి తీసుకపోయారు.

సాధుమహాత్ముని పరీక్షించడం అతని మనోవృత్తి - ఆధారంతో జరుగుతుంది. గడ్డాలు, జడలతోగాదు. (జడలు గడ్డాలనుబట్టి సాధుమహాత్ముడని కాదు.) జడభరతుడు దేవికి మనస్సులోనే ప్రణామంచేశాడు. తలనువంచి శాన్తచిత్తంతో కూర్చున్నాడు. భిల్లురాజు భద్రకాళిని ప్రార్థించాడు. కత్తిని తీసుకొని బలి తల నరకడానికి సిద్ధమయ్యాడు.

అందరి విషయంలో సమభావం గలిగిన భరతుణ్ణి చూచి దేవి హృదయం పొంగిపోయింది ఆమె ఈ హింసను చూడలేకపోయింది, భద్రకాళి విగ్రహాన్ని పగలగొట్టి ప్రకటిత మైంది. భిల్లురాజు చేతిలోని కత్తిని తీసుకొని అతని శిరస్సునే నరికింది, తలను బంతిచేసి బంతి ఆట ఆడసాగింది.

జ్ఞాని అయిన భక్తుడు తలుస్తాడు అనేక బాహువులుగల భగవంతుడు తనను కాపాడేందుకు నిలబడి వున్నాడు. రెండు చేతుల మానవుడేం రక్షించగలడు ? జ్ఞానవంతుడైన భక్తుడు దేవికి చాలా ప్రియులు. జ్ఞాని తమ మనస్సును ఒక్క క్షణ కాలంకూడ భగవంతుణ్ణుండి వేరు కానీయడు. అతనిదృష్టి బ్రహ్మమయము.

ఒక సమయంలో సిన్ధుదేశపు రాజు రహూగణుడు కపిలముని వద్దకు బ్రహ్మజ్ఞాన ప్రాప్తికోసరం వెళ్ళినాడు. తత్త్వజ్ఞాన ప్రాప్తికోసర మాయన పల్లకిలో కూర్చుని కపిల ముని ఆశ్రమానికి పోసాగాడు. పల్లకి మోసే నలుగురు సేవ కులలో ఒకడు దారిలో ఎక్కడికో పారిపోయాడు. అంత రాజు ఎవడు చిక్కితే వాణ్ణి పట్టుకరమ్మన్నాడు.

వైష్ణవుడు భగవంతుని ఇచ్ఛప్రకారం జీవిస్తాడు. జ్ఞాని ప్రారబ్ధకర్మ ననుభవించాలనే జీవిస్తాడు. జ్ఞానులు అనిచ్ఛలో ప్రారబ్ధాన్ని చూస్తారు, వైష్ణవుడు ప్రారబ్ధంలో భగవంతుని ఇచ్ఛను చూస్తాడు. నాల్గు చేతులంత (నాల్గుబారలు) దూరా నికి మించి చూపు పోనీవాకని సాధకునికి స్పష్టమైన ఆజ్ఞవుంది. చూపు చంచలమైతే మనస్సు చంచల మౌతుంది.

జడభరతుడు హృష్టపుష్టంగా వున్నాడు పల్లకి మోయ డానికి బాగా పనికివస్తాడని తలంచి రాజభటులతనిని పట్టు కొచ్చారు. పల్లకి మోయమన్నారు. భరతుడు పల్లకిని ఎత్తు కొన్నాడు. ఇంతవరకు (గత రాజజన్మలో) అనేకమార్లు స్వయంగా ఎవడు పల్లకిలో కూర్చున్నాడో అతనే నేడు ఈ (జన్మలో) పల్లకి మోస్తున్నాడు. ఇదే అతని ప్రారబ్ధం అనుభవిం చాల్సి వుంటుంది. ఆఖరుజన్మ అయినప్పటికి ఇతనికి పల్లకి మోయాల్సి వచ్చింది. భరతుడు నా వలన ఏ ప్రాణికి హింస జరుగకుండుగాక అని క్రిందచూస్తూనడుస్తున్నాడు అతనికి ప్రతిప్రాణిలో భగవంతుడు కనిపిస్తున్నాడు.

భరతుడాలోచిస్తున్నాడు - ఇక నాకు కొద్దే ప్రారబ్ధం వుంది, చస్తే నా శరీరమే చస్తుంది. నేను నారాయణునిలో కలసి పోతాను. నేను సావధానంగావుండాలి - అని. అసావధానంగావుంటేనే కామక్రోధ లోభాదులు తలపై కెక్కి సవారి చేస్తాయి. కాబట్టి నిర్భయుడవుగా వుండు. ఎల్లప్పుడు పరమాత్మ సాన్నిధ్యం అనుభూతమైనప్పుడే నిర్భయత్వం కలుగుతుంది. భరతుడు దారిలోకూడ భగవంతుణ్ణి ప్రార్థిస్తూ నడుస్తున్నాడు.

మనశ్శుద్ధిచేసేకోసం భరతుని ఆతురతనుపెంచి భగవంతుడదృశ్యమయ్యాడు. భగవంతుడు కనుపించకపోయేసరికి భరతుడు వ్యాకులతగలవాడై ఏడ్వసాగాడు. "ప్రపంచంలో నేను వ్యర్థంగ అటుఇటు తిరుగబనిలేదు. ప్రభూ! నన్నెపుడు నీ శరణుకు తీసుకుంటావు? నా ప్రారబ్ధమెపుడు సమాప్తమవుతుంది? ఇపుడుకూడ నాకు పరమాత్మదర్శనం ఏల కావడంలేదు!" అను నీ ఆలోచనలతో భరతుడు ఏడుస్తాడు.

దారిలో చీమకనుపిస్తే ఎగిరి దుముకుతాడు (అది పాదాలక్రిందపడి చావకూడదని). అలాదూకడంవలన పల్లకిలోని పై భాగానికి రాజు తల కొట్టుకుంటూంది. రాజు సేవకులతో "బాగా - సరిగా నడువండి, నాకు ఇబ్బందిగావుంది" అని చెప్పాడు. పాతసేవకులు ముగ్గురు రాజుతో- "హుజూర్! మేం బాగనే నడుస్తున్నాం, ఈ కొత్త సేవకుడే సరియైన

పద్ధతిలో నడవడం లేదు. అప్పుడప్పుడు నిలుస్తాడు, అప్పుడప్పుడు పరుగెత్తుతాడు. అప్పుడప్పుడు దుముకుతాడు. అప్పుడప్పుడు నవ్వుతాడు, అప్పుడప్పుడు ఏడుస్తాడు; ఇతను పిచ్చివానివలె వున్నాడు. ఇతనే ఏడిపిస్తూండడం" అని బదులు పలికారు.

(రహూగణ) రాజు జడభరతునితో వ్యంగ్యంగా అన్నాడు గదా - నీవు బొత్తిగా దుర్బలంగా - బలహీనంగా, సన్నగావున్నావు, నీ అవయవాలుకూడ ఎంత దుర్బలంగా వున్నాయి? అంచేత పాపం సరిగా ఎలా నడుస్తావు?" అని. రహూగణరాజు "ఇకపై నేను భరతునిపై ఒక కన్నేసి వుంచుతాననుకున్నాడు. భరతుడాలోచిస్తున్నాడు - దారిలో ఏదైన ప్రాణి కాలిక్రిందపడి నలిగిపోతే నాకు పాపంవస్తుంది" అని. భరతుడు చీమలోకూడ భగవంతుణ్ణి (కృష్ణుణ్ణి) చూస్తున్నాడు. భగవంతుడు - కృష్ణుడు ఏ ఒకరింట్లో నేవుండడు. ఎవడు అందరిలో కృష్ణుణ్ణి చూస్తాడో వాడే వైష్ణవుడు.

భరతుడు రాజు మాటలపైన ధ్యానముంచలేదు. చీమలను చూచి ఎగిరిదుమికాడు. దాంతో రాజు తల పల్లకి యొక్క పై భాగపు కర్రకు మరలకొట్టుకొనింది. రాజు దాన్ని సహించలేకపోయాడు. అతడు కోపంతో జడభరతున్ని - అరే నీవు బ్రతికుండే చచ్చినవాడివి. నీకు జ్ఞానం లేదు. సరిగా నడు - అంటూ అవమానించ సాగాడు. నివురుగప్పిన నిప్పు ఏవిధంగా కనిపించదో ఆ విధంగా బ్రహ్మచింతనలో లీనమైన

జ్ఞానిని గుర్తించజాలము. మరల ఒకమారు రాజు తలక్రను తిగిలింది. రాజు కోపంతో - నేను రాహూగణరాజును నిన్ను శిక్షిస్తాను'' అన్నాడు.

భరతుడు రాజు నుండి (కూలి) ఒకపైసా కూడ తీసుకోలేదు. రాజుగారియొక్క భోజనం కూడ ఏమి తినటూలేదు. (పైగా ఉచితంగా పల్లకి మోస్తున్నాడు.) అయినా రాజు భరతుని కొట్టడానికి తయారయ్యాడు. భరతుని కొట్టడానికి రాజుకేమి అధికారముంది? రాజు గర్విపోతు అతడు మదాన్ధుడయ్యాడు. భరతునికి బదులు మాట్లాడదాని కిష్టం లేకుండినది. అతడు (భరతుడు) ఆలోచించాడు - ఈశరీరం హృష్టపుష్టంగావుంది. సన్నగావుండటంకూడ శరీరం ధర్మం, ఆత్మకు అంటూవా ఏ ధర్మాలు లేవు ఈరాజు నా శరీరం గూర్చి మాట్లాడుతున్నాడు. అంచేత అతనితో మాట్లాడ వలసిన అవసరంలేదు, నేను మౌనంగానే వుంటాను.

భరతుడు మరల ఆలోచించ సాగాడు. నా అవమానం కొద్దిగా కూడ లెక్కలోనిదికాదు. కానీ నేను అతనిని మోస్తున్నాను; ఇతడు రహూగణరాజు ఒకవేళ నరకవాసి అయితే భూలోకం నుండి సత్సాంగత్య మహిమ నశించిపోతుంది జనులు మహాజ్ఞాని జడభరతుడు ఎవనిని తన భుజస్కంధాలపైకి ఎత్తుకున్నాడో, అతడు కూడ నరకవాసే అయ్యాడు అని అంటారు. ప్రపంచంలో సత్సాంగత్యానికి గొప్పమహిమవుంది. ఏమైనాకానీ, రాజునిప్పుడు నేను నా

భుజాలపై కి ఎత్తుకొనసే ఎత్తుకొన్నాను. కాబట్టి అతనిని ఉద్ధరిస్తాను కూడ అని భరతుడు రాజుకు ఉపదేశ మిచ్చేందుకు నిశ్చయించాడు. సత్సంగ మహిమను నిరూపించే కోసరం నేడు జడభరతుడు మాట్లాడ దలంచాడు. నేటివరకు అతను మౌనంగా వుండినాడు. రాజుకోసరం అతనికి దయకలిగింది. మాట్లాడడానికి ఇష్టం కలిగింది. రాజుకు మంగళం కలుగుగాక!

కపిలముని ఆశ్రమంలో తత్త్వజ్ఞానోపదేశం పొందే కోసరం రాజు పోతూండినాడు. ఉపదేశం కోసరం దీనుడై, నమ్రుడై పోవాలి. కాని ఈ రాజు తన అహంకారాన్ని కూడ తీసుకుపోతూన్నాడు. అతడు అభిమానాన్ని తీసుకొనిపోతే అతనికి ఋషి విద్యనివ్వడు. కాబట్టి నేడు నేను ఇతనిని అధికారిగా తయారుచేస్తాను అని భరతుడు నిశ్చయించాడు. రహూగణరాజు భాగ్యశాలి.'' ఓమ్.





## సూక్తి

రోజూ మూడు గంటలు నియమ పూర్వకంగా నీవు నా సేవ చేస్తే నిన్ను పాపమార్గమున పోకుండా నివారిస్తానని భగవంతుని మాట.

— శ్రీ గురుదేవులు,



# "సర్వార్థమూలం - మనస్సంభవమూలం"

రచన - బ్రహ్మచారి విష్ణుదేవానంద,

శ్రీ నారాయణ ధ్యానకుటీరం, కె. ఎర్రగుడి.

ప్రహ్లాదుడు చెప్పినట్లు సకలకాంక్షలకు మూలమైన మనస్సు కాంక్షలు కల్గినప్పుడు దుఃఖాన్ని, అశాంతిని పొందుతున్నది. భగవాన్ కృష్ణుడు గీతలో "ప్రసాదే సర్వదుఃఖానాం" అన్నాడు. ప్రసన్నత్వము వలన సమస్త దుఃఖములు నశించిపోగలవు. ఆచార్య శంకరులు గూడా వివేకచూడామణిలో యిలా అంటారు, "బాహ్యే నిరుద్ధే మనసః ప్రసన్నతా। మనః ప్రసాదే పరమాత్మ దర్శనమ్। తస్మిన్ సుదృష్టే భవబంధనాశో। బహిర్నిరోధః పదవీ విముక్తేః" దృశ్య ప్రపంచమును నిరోధించటము వలన మనస్సుకు ప్రసన్నత యేర్పడును; మనః ప్రసన్నత వలన పరమాత్మ దర్శనము కలుగుచున్నది. పరమాత్మ దర్శనము వలన భవబంధ నాశము కల్గుచున్నది. దృశ్యనిరోధమువలన విముక్తి లభిస్తున్నది అనగా సర్వదుఃఖనాశము, ఆనందప్రాప్తి కలుగుచున్నది.

శ్రీ రమణమహర్షులు తమ ఉపదేశసారములో యిలా అంటున్నాడు. "దృశ్యవారితం చిత్తమాత్మనః। చిత్తదర్శనం తత్త్వదర్శనం" మనస్సు దృశ్యములను చూడకుండునట్లు నిరోధింపబడిన యెడల చిత్త (తత్త) దర్శనమగును.

బుద్ధభగవానులు మనస్సును గూర్చి యిలా అంటున్నారు. మనస్సును అధీనంలో వుంచుకోవడం చాలా కష్టము. ఇది వాంఛిత విషయాల మీదికి వేగంగా కదలుతుంది. చిత్తాన్ని అదుపులోనికి తేవడం మంచిది. అదుపులోవున్న చిత్తం సుఖాన్ని కలి

గిస్తుంది. మనస్సు భవిష్యత్తుకు పరుగులుతీసి గాలిమేడలు కట్టుంది. లేదా గతానికి పరుగులుదీసి జరిగిపోయిన సంఘటనలను మరోవిధంగా జరిగినట్లుగా వూహిస్తుంది. ఇలాంటి వికల్ప వృత్తుల వల్ల మనస్సు అలసిపోవడం మానసికశక్తి వృధాకావడం తప్పించి వేరే ప్రయోజనం కలుగదు. కనుక మనస్సుయొక్క కదలికల మీద సదా గమనిక కల్గివుండి దాన్ని వర్తమానంలోనే వుంచగల్గితే రాగద్వేష మోహాలనె సంసారబంధాలు తెగిపోతాయి,

వేదుల పద్యానువాదము వివేకచూడామణిలో యిలా అంటున్నది.

"ఎట్టో మనస్సును బోధించి కట్టుబాటు
లందు నుంచగవలెను, ప్రయత్నమంది.
మనస్సు పరిశుద్ధమైనచో మఱి యికేమి
మోక్షమరచేతనుండు ముముక్షువులకు."

మనఃస్థితిని గూర్చి యోగవాసిష్ఠము యిలా వక్కాణిస్తూ వున్నది. "భావరహితంగా, నిశ్చలస్థిర గంభీరంగా వుండి మనస్సు పొందే ఆనందం బ్రహ్మలోకములోగానీ, ఇంద్రసదనములోగానీ, అందమైన చందమామలోగానీ లేదు. దానికదే సాటి" మానసిక బంధాలను మిథ్యగా గుర్తెరిగి శాంతుడయిన జ్ఞానికి లక్షత్రిమూర్తు లయినా సాటిరారు.

ఉపనిషత్తులు యిలా ఉద్ఘాటించినవి. "అలజడి, అశాంతి లేకుండా నిశ్చలంగావున్న మనస్సే అమృతత్త్వం, అదే తపస్సు, ఉపనిషత్ మాటల్లో దానినే మోక్షమంటారు. పంచజ్ఞానేంద్రియ ములు, మనస్సు ఆత్మయందు విశ్రాంతిగావుండి, బుద్ధికూడా

ఆత్మయందు నిశ్చలంగా వుండు స్థితే పరమస్థితి" "మనస్సు యొక్కయు, యింద్రియములయొక్కయు, ఏకాగ్రత శ్రేష్ఠమగు మనస్సు. ఇదియ్యే సకల ధర్మముల కంటె అధికమైనది. ఇదియే శ్రేష్ఠమయినధర్మమని పంచమవేదము పలికినది.

ప్రహ్లాదుడు చెప్పినట్లు సమస్తశాస్త్రములు చెప్పినది, మనస్సు నరికట్టుటయే - మనస్సును సర్వదా పవిత్రంగా పెట్టు. ఎందు కంటె చచ్చిన తరువాత నీవెంట వచ్చేది నీ మనస్సే. గీతాచార్యులు కూడా "మనః షష్ఠానీంద్రియాణి ప్రకృతి స్థాని కర్షతి". జీవుడు జ్ఞానేంద్రియాలైదు, మనస్సును వెంట తీసుకునిపోవుచున్నాడని తెలియజేశాడు.

శ్రీ వేమనయోగిసర్యులు కూడా "తలలు బోడి అయినా తలపులు బోడి అవునా" అని ఢంకా ప్రమోగించారు. తలపులు బోడి అయినప్పుడే అది తపస్సు. తలపులున్నప్పుడది సంసారము. బాహ్యవేషములు యెన్ని మారినా మనస్సు మారనిది నిష్ప్రయోజనము.

వేదుల పద్యానువాదము వివేకచూడామణీ యిలా వివరించినది,

"మనస్సుకంటెను వేరైన మాయలేదు;
మన సవిద్యయె, భవబంధజనకమదియె;
పెరుగుచో నది అన్నియు పెరిగినట్లె;
విఱుగుచో నద్ది అన్నియు విఱిగినట్లె;
"విషయము లటన్న అడవిలో పెద్దపులిగ
తిరుగుచుండు మనస్సంచు తెలియుమోయి;
కంటబడగూడ దెపుడు వ్యాఘ్రమ్మునకును
సాధక ముముక్షుడైనట్టి సాధుజనులు"

7

మనస్సుకంటె వేరే మాయలేదు. అవిద్యకు భవబంధము నకు కారణము మనస్సే. మనస్సు నశించిన సర్వప్రపంచము నశించుచున్నది. మనస్సు పెరిగిన సర్వప్రపంచము పెరుగు చున్నది. శ్రీ శంకరులు మనస్సును పెద్దపులితో పోల్చినారు. విషయములనెడి అరణ్యములో మనస్సనెడి పెద్దపులి తిరుగు చున్నదని గ్రహించవలెను. అట్లు తెలిసికొని మోక్షేచ్ఛగల సాధు వులు పెద్దపులివున్న ఆ విషయారణ్యమునకు పోకుందురు గాక !

ప్రహ్లాదుడు చెప్పినట్లు సమస్త కోరికలకు మూలమైన మనస్సును, సర్వశాస్త్రములు సమస్త మహాత్ములు చెప్పిన మార్గ ములలో యేదోఒకమార్గములో జయించి యీ జన్మలోనే మనము మోక్షము పొందెదమని విశ్వసిస్తున్నాను-

హరిః ఓం.



# స్వ విషయం

1970 వ సం॥రం మార్చి 3 వ తేది ఆశ్రమంలో అడుగిడటం జరిగింది. అప్పటి వయస్సు 11 సం॥ రాలు. "ఏకభుక్తం మహా యోగి" అనే ఆర్యోక్తిని అనుసరించి కఠినంగా నియమాలు పెట్టు కొని ఒకపూట మాత్రమే క్లుప్తంగా ఆహారం కొన్ని సంవత్సరాలు తీసుకోవటం, శక్తికిమించి గురుస్థానం బాగా వుండాలంటూ పనులు చేయటం, 12 సం॥రాలు జరిగింది, దాంతో ఆరోగ్యలోపం కల్గింది. యోగికాక రోగి కావటం అయింది. అయినా యథాశక్తిగా గురు కార్యమంటూ చేసుకొంటూ వుండటం జరిగింది. శ్రీ సద్గురుదేవుల అనంతరం మరింతా శక్తికిమించిన బాధ్యతలే. శ్రీ సద్గురు కృపతో-

ఆశ్రమవాసుల సహకారంతో ఆశ్రమ కార్యక్రమాలు - శుకవాణి పత్రిక - గ్రంథమాల యథాప్రకారం ఏ కొరతలేకుండా జరిగి పోతూ వున్నాయి. భక్తుల రాకపోకలు యథాతథంగా నడుస్తూ న్నాయి. చాలామంది పర్యటనకు రావాలని పిలుస్తారు. ఇక్కడికి వచ్చిన భక్తులకు "మాతాజీ లేర"ని నిరుత్సాహం చెందుచున్నారు. "మీరుంటే మేమువచ్చి శ్రీ సద్గురు సన్నిధిలో 3 - 5 - రోజులుండి సాధన చేసుకొంటాము. మీరు వుండేది తెల్పండమ్మా అంటూ ఎందరో అంటున్నారు. శ్రీ సద్గురు సన్నిధిలో చేయవలసిన కార్యా లున్నాయి. అదీకాక శరీరపరిస్థితినిబట్టి, ఆశ్రమ పరిస్థితినిబట్టి శ్రీ సద్గురు సన్నిధికివచ్చే భక్తుల సంకల్పమే శ్రేయస్సు అనిపిం చింది. కావున ఉగాది వరకు ఎక్కడికి వెళ్ళను. రావాలను కొన్నవారు వచ్చి 3 - లేక 5 రోజులుండవచ్చును. అవకాశమున్న భక్తులు వారమైనా వుండవచ్చును.

వచ్చేముందు వీలున్నంతలో తెల్పి రాగోర్తాము, తెల్పటం కుదరనిచో వారి అనుకూలంబట్టి రావచ్చును. శ్రీ సద్గురు భక్తులం శిష్యులం అనుకొన్నవారు అప్పుడప్పుడు రాలేకపోయినా సంవత్స రానికి ఒకసారైనావచ్చి శ్రీ సద్గురు సన్నిధిలో 3 రోజులైనా సాధన జరుపుకొనటం చాల శ్రేయస్సు. ఆ విధంగా భక్తులు - శిష్యులు - ఆచరించి ఆనందం కల్గిస్తారని భావిస్తాను.

ఏప్రిల్ 10-వ తేదీ వరకు ఎక్కడికి వెళ్ళను. వచ్చేవారు తెల్పిరాండి.

ఓం

శ్రీ సద్గురు స్మరణలతో

మా తా జీ,

ఓం శ్రీ గురుభ్యోనమః

# శ్రీ గురు చరిత్ర

## 40-వ అధ్యాయము

### (గురుమహిమచే ఎండుకట్టె చిగురించుట)

గురుదేవుడు గాణగాపురిలో నుండగా ఒకనాడు కుష్ఠురోగ గ్రస్తుడగు ఒక బ్రాహ్మణుడు అచటికివచ్చెను. అతని పేరు నరహరి. అతడు గురుచరణములకు భక్తితో నమస్కరించి గురువును స్తోత్రముచేసెను. తరువాత అతడిట్లు చెప్పదొడగెను. "ఓ గురు మూర్తీ! భక్తవత్సలా! నేను మహాపాపిని. కుష్ఠురోగముచే బాధ పడుచున్నాను. లోకులు నా ముఖము చూచుటకుకూడా వెరతురు. నేను యజుర్వేదమును అధ్యయనము చేసినాను. ఈ రోగపీడచే నా జన్మము వృథాఅయిపోయినది. పెక్కువ్రతాలు తీర్థయాత్రలు, దేవపూజలుచేసితిని, అవన్నీ వ్యర్థమయి పోయినవి. అందువలన నాకీ జన్మముపై రోతజనించి ప్రాణత్యాగముచేయ నిశ్చయించి నాను. కరుణాపూరితులగు తమ దర్శనముచేసి తమ అనుమతితో ప్రాణములను త్యజించ దలచినాను. నన్ననుగ్రహించండి." ఇట్లు విన్నవించి గురుచరణములకతడు మరల మ్రొక్కెను. గురువతని కృపాదృష్టితోజూచి ఇట్లు చెప్పెను "నీవు పూర్వజన్మములో మహా పాపాలను ఆచరించినావు. ఆ కారణంగా నీవిపుడు కుష్ఠురోగానికి గురైనావు. నిశ్చలమగు నమ్మకముతో నీవు నేను చెప్పినట్లు చేసినా వంటే నీ పాపాలు హరించిపోయి నీ రోగము పూర్తిగా నివారణ కాగలదు." గురువట్లు చెప్పునపుడు అచట ఒకడు బాగా ఎండి

పోయిన మేడిచెట్టు కొమ్మను పంటచెరకుకై కొనిపోవుచుండెను. గురునాథుడతని జూపి "నీవా కట్టెను అతనినుండి పుచ్చుకొని, సద్భావముతో సంగమ స్థానానికి నడచిపోయి, అచట సంగమ స్నానమాచరించి, అచటనున్న అశ్వత్థవృక్షమును పూజించి, ఆ కట్టె మొదటిభాగాన్ని భీమానది గట్టున నాటుము. తరువాత రెండు కడవల నీళ్ళు దానికి పోయవలెను. ఇట్లు రోజూ మూడుసార్లు స్నానమాచరించి, విశ్వాసముతో ఆ కొమ్మకు నీళ్ళు పోయుచుండ ఆ కొమ్మ చిగిరించినపుడు నీలోని దోషాలు హరించిపోయి నీదేహము రోగనిర్ముక్తమగును. "గురువాక్యముపై దృఢవిశ్వాసముంచి, ఆ బ్రాహ్మణుడు భక్తిభావముతోను ఉపవాసముతోను అట్లే చేయు చుండెను. అది చూచిన బ్రాహ్మణులు అతనిని వెర్రివానిగా భావించి అతనికిట్లు చెప్పుచుండిరి." "నీకేమైనా మతిపోయిందా ? ఎండుకట్టెను భూమిలోనాటి దానికి నీరుపోసిన అది చిగురించునా? గురుదేవుడు పరమకృపాళువు అయన తలచుకొంటే నీ రోగము తక్షణమే నివారణై పోయెడిది. నీ పాపానికి నివృత్తిలేదు కాబోలు. అందుకే ఆయన నిన్ను ఎండుకట్టెకు నీరు పోయమని నిర్దేసించి నాడు. ఇది వృథాప్రయాస మాత్రమే !" అది విని నరహరి హరికి నమస్కృతులర్పించి ఇట్లు చెప్పేవాడు. గురునాథుడు పరమాత్మ స్వరూపుడు. ఆయన వాక్కు నాకు కామధేనువు. అది తప్పక ఫలించును. అనే నమ్మకము నాకుంది. అది పొల్లు కాజాలదు." అని సమాధాన మిచ్చేవాడు,

ఇట్లతడు భక్తి ఉపవాసాలతో ఎండుకట్టెకు నీళ్ళు పోయు చుండగా ఏడునాళ్ళు గడచెను. ఎనిమిదవదినము మఠములోని

శిష్యుడొకడు గురువునకిట్లు తెలిపెను. ఆ బ్రాహ్మణుడు ఏడు దినాలుగా ఎండిపోయిన ఔదుంబరపు కట్టెకు నీళ్ళుపోయు చున్నాడు. ఉపవాసము చేయుటచే అతని నోరారిపోవుచున్నది. అతని ప్రయత్నాలు ఫలించే సూచనలు లేవు. "అదివిని గురువిట్లు చెప్పెను. "అంతఃకరణములోని శుద్ధభావము ఫలించి తీరును. గురువాక్యము కారణము. దానిని భక్తిశ్రద్ధలతో పాటించినచో శిష్యునికార్యము సిద్ధించును. గురువాక్యము పైనగల విశ్వాస మహిమ అద్భుతమైనది దీనిని నిరూపించెడి ఒకపురాణకథగలదు. పూర్వము పాంచాలనగరములో సింహకేతువు ఒక రాజుండెను. అతనికి ధనంజయుడను కుమారుడుండెను. ఒకనాడు ధనం జయుడు అడవికి వేటకైపోయి దప్పిగొనెను. నీటికై అతడు వెదకుచూ అడవిలో తిరుగుచుండగా, అతనికి తనవలెనే దప్పిగొన్న ఒక భిల్లుడు తోడాయెను. ఇద్దరు వెదకుచూ అడవిలో ఒక శివా లయమును కనుగొనిరి. అచట లభించిన నీటితో దప్పి దీర్చుకొనిరి. భిల్లునికి ఆ శివాలయ సమీపములో లింగాకారముగల ఒక శిల దొరకెను. అతడు దానిని తీసుకొని, "నాకు శివార్చన చేయవలెనని కోర్కెగలదు. నాకు దయతో శివార్చన చేసే తీరును తెలుపండి" అని రాజకుమారుని కోరెను. ధనంజయుడందుకు సంతసించి శివార్చన విధానము నిట్లు తెలిపెను.

"ఈ పాషాణలింగాన్ని నీ యింటికి కొనిపోయి అచట స్థాపిం చుము. స్నానానంతరము శుచిగా దానికి పత్రపుష్పాదులర్పించి పూజించవలెను. దంపతులిద్దరూ ఈ లింగము సాక్షాత్తు శివుడేయని భావించి పూజించవలెను. దీనికి పూజాసమయములో పలురకాల

పుష్పాలు ధూపదీపాలు నైవేద్యము సమర్పించవలెను. శివునికి చితా భస్మముపై ప్రీతిమెండు. నీవు నిత్యము స్మశానమునుండి చితాభస్మమును దెచ్చి దానితో లింగాన్నలంకరించవలెను. వండిన అన్నమును నైవేద్యముగా సమర్పించి, దానిని ప్రసాదముగా భావించి భక్షించవలెను. ఇదే శివపూజా విధానము."

భిల్లుడు రాజకుమారుని గురువుగా భావించి అతని వచనములపై దృఢవిశ్వాసముంచి, తన పత్నితో కలసి ఆలింగాన్ని సంతోష పూర్వకముగా పూజించుచుండెను. రోజూ స్మశానము నుండి చితాభస్మమును దెచ్చి దాన్నలంకరించుచుండెను. ఒక నాడు ఆ ఊరిలో చితాభస్మము చిక్కలేదు. ఆ చుట్టూనున్న ఊర్లలో వెతకినా భస్మము చిక్కలేదు. ఆనాడు భస్మము లేక పూజెట్లు నడిపేది యని భిల్లుడు విచారించుచుండెను. అదెరిగి అతని భార్య అతనికిట్లు చెప్పెను, నేను నీ ధర్మపత్నిని మరియు అర్థాంగిని. ధర్మకార్యములో భర్తకు సహాయముచేయుటే భార్య కర్తవ్యము. అస్థిరమగు నా శరీరాన్ని దైవకార్యానికర్పించి తరించ దలచాను. నేను మన గుడిసెలో నుండగా నిప్పంటించి, తరువాత నా భస్మాన్ని శివపూజ కర్పించండి దీనికై మీరు విచారించవలదు" మొదటతడు దానికి సమ్మతించక పోయినా ఆమె ఒత్తిడితో అందుకు సమ్మతించి, గుడిసెకు నిప్పంటించెను. భార్య చితాభస్మముతో శివపూజ సాగించి, పూజానంతరము అలవాటు చొప్పున, ప్రసాదము పుచ్చుకొనుటకు తన భార్యను కూతేసి పిలచెను: వెంటనే ఆమె వచ్చి అచట హాజరయ్యేను. కాలిన గుడిసె కూడా ముందటివలె యథాతథముగా నుండెను. భిల్లుడిది జూచి ఆశ్చర్యవందెను.

నీవిచటకెట్లు వస్తివని భర్త భార్య నడిగెను. గుడిసెలో నిద్రించు చుండగా నీవు వేసిన కూతవిని లేచివచ్చితినని ఆమె బదులిచ్చెను. ఇదంతా ఈశ్వరకృప అని భావించి అతడు భక్తిపరవశుడై యుండెను, అప్పుడు పరమేశ్వరుడు వారిముందు ప్రత్యక్ష్యమై ప్రసన్నభావముతో మీరు ఈ లోకములో సుఖసౌభాగ్యాలతో జీవించి తరువాత అనంతకల్పాంతరము స్వర్గసుఖము ననుభవింతురుగాక! అని దీవించి దంపతుల దండప్రణామాలందుకొని మాయ మయ్యెను.

గురువిట్లు చెప్పి తన కథను ముగించి గురువాక్యము పైన విశ్వాసము గలవారికి ఇంతటి ఫలము లభించుటలో ఆశ్చర్యము లేదని చెప్పి, నదీసంగమమునకు బయలుదేరెను. అచట నరహరి ఎండుకట్టెకు శ్రద్ధతోచేయుచున్న సేవకు సంతసించి, అతడు తన ఎదుట నిలచిఉండగా, ఆ కట్టెపై తన కమండలములోని జలము తీసి చల్లెను. వెంటనే అది చిగిర్చి మిసమిసలాడు పచ్చటి ఆకు లతో చెట్టయి విలసిల్లెను. అదే సమయములో ఆ బ్రాహ్మణుని కుష్ఠురోగము మాయమైపోయి అతని శరీరము స్వర్ణకాంతితో ప్రకా శించెను. నరహరి ఆశ్చర్యానందాలతో మునిగి గురువునకు సాష్టాంగ నమస్కృతులర్పించెను. గురుప్రేరణచే మహాస్తోత్రమును పఠిం చెను. గురువందుకు సంతుష్టుడై, నీవు సంతాన సౌభాగ్యాలతో వర్ధిల్లుము. నీవు నీసంతానము నాకు భక్తులై వేదశాస్త్రపారంగతులై ప్రఖ్యాతిని గాంతురు అని దీవించి. అతనికి విద్యాసరస్వతి అను మంత్రము నుపదేశించి, యోగీశ్వరుడను పేరుపెట్టెను. గురువచన ప్రకారమే నరహరి అతని సంతానము వర్ధిల్లిరి.

ఓమ్ తత్ సత్.



ఓం గణేశాయ నమః

# దేవర్షి నారద చరిత్రము

రచన :

కె. సుబ్బారెడ్డి - బెంగుళూరు. అధ్యాయం - ౩

## నారదునిచే పలువురకు భక్తి మార్గోపదేశము

నారదమహర్షి వేదసమములగు భాగవత రామాయణాల రచనకు ప్రేరణ చేయుటయేగాక పెక్కుమందికి భక్తి మార్గోపదేశము చేసి వారిని తరింపజేసెను. వారిలో ముఖ్యులు ధ్రువుడు, దక్షుని పుత్రులగు హర్యశ్వులు మరియు శబలాశ్వులు, పరమభాగవతుడగు ప్రహ్లాదుడు. ద్వాపరయుగాంతమందు ద్వారకానగరమునకేగి దేవకీవసుదేవుల కోర్కెను మన్నించి వారికి ముక్తిమార్గము నుపదేశించెను. ఈ భక్తుల కథలను వారికి నారదమహర్షి చేసిన హితోపదేశములను గురించి సంక్షేపంగా తెలుసుకొందాము.

## 1. ధ్రువోపాఖ్యానము

కృతయుగములో స్వారోచిష మనువుపుత్రులలో నొకడగు ఉత్తానపాదుడు రాజ్యము చేయుచుండెను. అతనికి సురుచి, సునీతి అను పేర్లుగల ఇద్దరు భార్యలుండిరి. సురుచికి ఉత్తముడు, సునీతికి ధ్రువుడు అను ఇద్దరుపుత్రులు కలిగిరి. సురుచి రెండవభార్య అగుటచే ఉత్తానపాదునికి ఆమెపై ప్రీతిమెండు. అందువలన పెత్తనము ఆమెదే సాగుచుండెను. ఒకనాడు బాలుడగు ఉత్తముడు తండ్రి తొడపైన కూర్చొని

యుండగా జూచి తాను తండ్రి తొడపై కెక్కి కూర్చొనవలెనని పసివాడగు ధ్రువునికి కూడా మక్కువ కలిగెను. అతడందుకై ప్రయత్నించుచుండగా సురుచి అది జూచి సహింపజాలక ధ్రువుని చేయిబట్టి వెనుకకులాగి ఇట్లు పరుషోక్తులాడెను. “ఓ బాలకా! నీకు తండ్రితొడపై కెక్కి కూర్చొనుటకు అర్హత లేదు. నీవు పురుషోత్తముడగు నారాయణుని గూర్చి తపస్సు చేసి నా గర్భమున బుట్టెడి భాగ్యమును సంపాదించుకో. అప్పుడే నీకా అర్హత లభించును.” ములుకులవంటి పినతల్లి కఠోరపు పలుకులు ధ్రువుని లేతమనస్సును తీవ్రంగా గాయపరచెను. అతడు కడు దుఃఖముతో తల్లియగు సునీతిని చేరి ఆమెకు జరిగిన సంగతి దెలిపెను. అప్పుడు ధ్రువుడు ఐదేండ్ల బాలుడు మాత్రమే. సునీతి ధ్రువుని ఓదార్చి, అతనికిట్లు బోధించెను. “కుమారా! మీ పినతల్లి చెప్పిన మాటలు వాస్తవములే నీ హితమును గోరే నీతో ఆమె ఆ మాటలాడినది. ఆమె చెప్పినట్లు నీవు దయాళువగు అధోక్షజునారాధించి రాజసింహాసనమునకు అర్హతను సంపాదించుకో. ముముక్షువులు కూడా అతని దివ్యపదముల నారాధించి, తరించుదురు విష్ణుపదాశ్రితులను లక్ష్మీదేవి కూడా ఆశ్రయించును. నీవతనిని నిష్ఠతో ధ్యానించి సఫలుడవుగమ్ము” అని చెప్పి ఆశీర్వదించి పంపెను.

ధ్రువుడు తల్లి మాటలను లక్ష్యముగా బెట్టుకొని నగరును వదలి తపస్సు చేయుటకై అడవికి బయలుదేరెను.

దారిలో దైవవశమున అతనికి నారదు డెదురయ్యెను. నారదు డా బాలకుని అడిగి అతని ద్వారా జరిగిన సమాచారము నంతటిని తెలుసుకొనెను. ఆ బాలకుని క్షాత్రమునకు ఆశ్చర్యము చెంది, అతడు పినతల్లి పలికిన నిష్ఠురోక్తులకు కలగి అతని హృదయములో కలిగిన తపోనిశ్చయమునకు మనస్సు మెచ్చుకొనుచూ, నారదుడు పాపహారమగు తన హస్తమును ధ్రువుని మస్తకముపై నిడి అతనికిట్లుబోధించెను. "ఓకుమారా! నీవు ఐదేండ్లైనా నిండని పసిబాలుడవు. నీకు మానావమానములపైన ఇంత పట్టుదల పనికిరాదు. ఇది క్రీడలతో వినోదించవలసిన సమయమేగాని, ఉగ్రతపస్సుకు తగిన వయసు కాదు.

కం॥ విను పుత్రక బాలుడవై
అనయంబు క్రీడలందు ఆసక్తమనం
బున దిరిగెడు నిక్కాలం
బున నీకవమాన మానములు లేవెందున్.

తె. భాగ. 4-237.

నీకొకవేళ అవమానములో రోషము జనించి పగ సాధించే పట్టుదల కలిగినా అది అజ్ఞానముచే జనించునదని నా అభిప్రాయము. ఎందుకనగా మనుజునికి కలిగె మానావమానములు అతని పూర్వజన్మ కర్మ ఫలితంగా కలిగినవే గాని వేరుగావు. ఇది విధి నియతి. దీనిని గుర్తించి సత్పురుషులగువారు దుఃఖము కలిగినపుడు కుందరు, సంతోషము కలిగినపుడు ఉప్పొంగరు. రెంటిని సమానముగా స్వీకరింతురు. పైగా నీవు నీతల్లి ఉపదేశము ననుసరించి ఎవరిని గురించి తపస్సు చేయదలచినావో ఆతనిని మెప్పించి అతని అనుగ్ర

షామును పొందడము అంత సులభమైన పని కాదు. వేలాది సంవత్సరాలుగా మునులు తపస్సు చేసి అతని దర్శించలేకున్నారు. విధి నియతి వలన దుఃఖము లభించినా సుఖము లభించినా వాటి రెంటిని సమాధాన చిత్తముతో స్వీకరించి అజ్ఞానమును బాపుకోవలెను. మనుజుడు తన కంటే అధికుని చూచినపుడు సంతోషించ వలెను. తనకంటే అధముని జూచినపుడు అతనియెడ సానుభూతిని చూపవలెను. సమానగుణునియెడ మైత్రి భావము కలిగి ఉండవలెను, ఇట్టి వర్తనమును అలవరచుకొన్న వాడెప్పుడూ కలత చెందడు, సంతుష్టుడై ఉండును." (సశేషం.)

★

## "శుకవాణి" చందాదారులకు విజ్ఞప్తి

"శుకవాణి" చందాదార్లకు డిసెంబర్ 96 తో వారివారి చందామొత్తం M.O. ఫారంలోవేసి డిసెంబర్ సంచికలో M. O. ఫారం పంపబడినది. చందాదార్లు గమనించి వారివారి చందా త్వరలో పంపవలెను. జనవరినెలలో పంపనివారికి కూడా ఫిబ్రవరి సంచిక పంపబడును. అప్పటికీ పంపవలసిన చందా పంపనిచో మార్చినుండి పత్రిక పంపబడదు. కావున వారివారి చందాలు మార్చిలోపల పంపవలెను. పత్రిక పంపనిచో 'మాకు పత్రిక రాలేద'ని జాబులు వ్రాస్తారు చాలామంది. ఎందుకు రావటంలేదో గుర్తించరు. చందాకట్టనివారికి 1 - 2 నెలలు ఉచితంగా పంపించి తర్వాత కూడా వారు చందా కట్టనిచో పంపబడదు. పత్రిక రాలేదని వ్రాయుటంకాక చందా కట్టినామా? లేదా? అని గుర్తించగోర్తాము.

(మిగత రేపరు 3-వ పేజీలో చూడుము.)

ఓం

# భాగవత వైశిష్ట్యం

బ్రహ్మసూత్ర ఉపనిషద్భగవద్గీతలు అనే ప్రస్థాన త్రయంతోపాటు ప్రస్థానచతుష్టయంలో ఒకటిగా ప్రశంసింప బడిన భాగవత పురాణవైశిష్ట్యాన్ని

యత్రాధికృత్య గాయత్రీం వర్ణ్యతే ధర్మవిస్తరః ।
వృత్రాసుర వధశ్చాపి తత్తద్భాగవతం విదుః ॥

(గాయత్రిని అధికరించి, ధర్మవిస్తరం, వృత్రాసుర వధ ఎందుచెప్పబడునో అది భాగవతం) అని మత్స్యపురాణం పొగడగా, ముముక్షువగు పరీక్షిత్తునకు వ్యాసమహర్షి తనయుడగు శుకయోగీంద్రునిచే బోధింపబడినదియు, సర్వ పురాణాలందు ఉత్కృష్టమైనదనియు, సమస్త ఉపనిషత్తుల్య మైనదనియు, దీని మాహాత్మ్యం స్కాంధ, పద్మ, కూర్మ పురాణాదులచే ప్రస్తుతింపబడింది. వేదాంతశ్రవణ, భగవద్గీతా పారాయణాలచేత కూడ లభింపని భక్తి జ్ఞాన వైరాగ్యాలు భాగవత శ్రవణంచే లభించునని పెద్దలు ఇట్లు అనుచున్నారు.

"నిగమములు వేయు చదివిన
సుగమంబులు గావు ముక్తి సుభగత్వంబుల్
సుగమంబు భాగవతమను
నిగమంబు పఠింప ముక్తి నిషదనము బుధా!" (1-189)

భాగవత పఠనంచే పునర్జన్మ సిద్ధింపదు అను నారద మహర్షి మాటను అరయుడు. "నిర్గతకర్మంబై నిరుపాధికం బైన జ్ఞానంబు హరిభక్తి లేకున్న శోభితంబుగాదు. ఫలంబు గోరక కర్మంబీశ్వరునకు సమర్పణంబు సేయకున్న అది ప్రశస్తంబై యుండదు, భక్తి హీనంబులైన జ్ఞాన వాచాకర్మ కౌశలంబులు నిరర్థకంబులు గావున ... ... ... నిఖిల బంధమోచనంబు గాఁగ వాసుదేవుని లీలావిశేషంబులు భక్తితో అభివర్ణింపుము." ఈ వాక్యాల్ని బట్టి చూడ భాగవతం భక్తి యోగ మహిమను వెల్లడించి తన్మూలాన ఈశ్వరసాక్షాత్కార సాధనత్వంను నిరూపింప జనించినది అని తెలియుచున్నది.

భాగవత తత్త్వాన్ని భావగతం గావించుకొనుట భక్తులకు మాత్రమే సాధ్యం, "భాగవతము" అనెడి పంచాక్షరాలకు భ - భక్తి, గ = జ్ఞానత, వ = వైరాగ్యం, త = తత్త్వం, ము = ముక్తి - అను సంకేతం కలదని తెలుగునాట ప్రచారంలో వున్నది. భాగవతం కోరిన కోర్కెలను ఈడేర్చు కల్పవృక్షంవంటిదని పోతనామాత్యుడు ఇలా ప్రశంసించాడు.

"లలితస్కంధము, కృష్ణమూలము, శుకాలాపాభిరామంబు, మంజులతా శోభితమున్, సువర్ణ సుమనస్సుజ్ఞేయమున్, సుందరోజ్జ్వల వృత్తంబు, మహాఫలంబు, విమల వ్యాసాల వాలంబునై వెలయున్ భాగవతాఖ్య కల్పతరువుర్విన్ సద్ద్విజశ్రేయమై"(1-20)

వాఙ్మయంలో 'భగవత్' శబ్దముతో కూడిన గ్రంథాలు రెండు మాత్రమే కలవు. అవి 1. భగవద్గీత, 2. భాగవతము. భగవద్గీత భగవంతునిచే చెప్పబడింది. భాగవతం భగవంతుని గూర్చి చెప్పేది. కాగా భగవద్గీత లక్షణం, భాగవతం లక్ష్యం అని పెద్దలమాట.

భాగవత పరమార్థం ఆత్మతత్త్వనిరూపణమే. పరమేశ్వరుడు నిత్య పరిపూర్ణుడు. నిరాకారుడు. సచ్చిదానంద స్వరూపుడు. స్వపరభేద విరహితుడు. ఈ చరాచర ప్రపంచమంతయు అతనియందే పుట్టిపెరిగి లీనం అగుచున్నది. జగన్నాటక సూత్రధారియగు భగవానుడు ఈ జగత్తులో క్రీడిస్తున్నాడు. ఇది ఆతని లీల. సర్వాప్తకాముడగు పరమాత్ముడు నిరంతరం ఈ సృష్టి వ్యాపారంలో నిమగ్నుడగుట ఎందులకు అనియు, అతనికి ఈ సృష్టివలన ప్రయోజనం ఏమనియు అనుమానంకలుగవచ్చు. కాని భగవంతునికి ఇది అంతయువినోదం. ఈ సమస్త ప్రపంచం ఆతనికి ఆనందకరమైన ఒక వేడుకయై ఉండనోపును. సుఖదుఃఖాదులకు నిలయం అయిన యీ ప్రపంచం జీవునకొక నాటకరంగం. భగవానుడు సూత్రధారుడు. అతడు మనల్ని ఆడించుచు వినోదిస్తున్నాడు. జీవుడు యథార్థానికి పరమేశ్వర అభిన్నుడయ్యు మాయామోహితుడై అనాత్మ పదార్థమగు దేహాదికమందు ఆత్మ

భ్రాంతినొంది, సంసారసాగరంలో మునిగి, జననమరణ చక్రాన తగుల్కొని, దుఃఖభాజనుడు అగుచున్నాడు. ఆత్మ తత్త్వం పరమేశ్వర తత్త్వంతో అభిన్నమని ఆతడు ఎప్పుడు గ్రహించునో అప్పుడే ముక్తుడు అగును. ఇట్టి పరమార్థజ్ఞానం ముక్తి హేతువుఅని భాగవతం నిరూపిస్తున్నది. జీవుడు తాను జీవుం అని భావించుటయే బంధం. తాను పరమాత్మస్వరూపం అని తెలియుటయే ముక్తి. జ్ఞానం ముక్తికి కారణం అనియు, బంధం అసత్యం అనియు భాగవతంనందలి విదుర మైత్రేయ సంవాదంవలన స్పష్టంగా ఎఱుగనగును। జీవుడు ఈశ్వరుడు బ్రహ్మస్వరూపులే అయినను జీవుడు అనాత్మయందు ఆత్మ భావన వలన సంసారి అయ్యాడు. ఈశ్వరునికి అట్టిభావం లేదు. కాన సంసారాది బంధాలకు అతడు అతీతుడు. లేనిది ఉన్నట్టు భాసించుట మాయ. ఆ మాయ ఈశ్వరాధీనం. జీవుడు మాయకు లోబడ్డాడు. కావున జీవుడు ఈశ్వరానుగ్రహం నొందుటకు భాగవతాన్ని ఆశ్రయించాలి. దానిచే ఆత్మజ్ఞాన మోక్షాలు అతనికి సిద్ధిస్తాయి.

ఇట్టి భాగవతం అఖండ నిర్గుణ పరబ్రహ్మంను శ్రీకృష్ణ పరమాత్మ రూపాన సగుణంగా వర్ణించి మానవులకు భక్తి జ్ఞాన వైరాగ్యాలు కల్గుటకు కారణమవుతూవుంది.

"ఏ కథలయందు పుణ్య
శ్లోకుడు హరి చెప్పబడునో నూరి జనులచే
నా కథలు పుణ్యకథలని" - పెద్దలాకర్ణింతురో
అట్టి "అతి రహస్యమైన హరిజన్మ కథనంబు
మనుజుడెవ్వడేని మాపు రేపు
చాల భక్తితోడ చదువు తా సంసార
దుఃఖరాశి బాసి తొలగిపోవు" - అనియు,

ఇందు హరి చరిత్రలే వర్ణితాలైనను ఇందలి విజ్ఞానమంతయు వేదవేదాంతాల లోనిదే కావున

"వేద కల్పవృక్ష విగలితమయి శుక
ముఖ సుధాద్రవమున మొనసి యున్న
భాగవత పురాణ ఫల రసాస్వాదన
పదవి గనుడు రసిక భావ విదులు" - అనియు

భాగవతం ఉపదేశిస్తున్నది.

భాగవతానికి "హయగ్రీవ బ్రహ్మవిద్య" అను ప్రశస్తి కలదు. పరమేశ్వరుడు ఆత్మతత్త్వాన్ని హయగ్రీవుడై బ్రహ్మదేవునికి ఇట్లు చతుశ్శ్లోకాలలో ఉపదేశించెనట.

(అ) అహమేవాసమేవాగ్రే నాన్యద్యత్సదసత్పరమ్ ।
పశ్చాదహం యదేతచ్చ యోఽవశిష్యేత సోఽస్మ్యహమ్ ॥

(ఆ) ఋతేఽర్థం యత్ప్రతీయేత న ప్రతీయేత చాత్మని ।
తద్విద్యాదాత్మనో మాయాం యథాభాసో యథా తమః
॥

(౩) యథా మహాంతి భూతాని భూతేషూచ్చావచేష్వను।
ప్రవిష్టాన్య ప్రవిష్టాని తథా తేషు న తేష్వహమ్।
(౪) ఏతావదేవ జిజ్ఞాస్యం తత్త్వజిజ్ఞాసునాఽఽత్మనః॥
అన్వయ వ్యతిరేకాభ్యాం యత్స్యాత్సర్వత్ర సర్వదా।
(భా. 2-9-33-36)

(సృష్టికి పూర్వం నేను ఒక్కడనే ఉంటిని. స్థూల సూక్ష్మ ప్రపంచాలుగాని, వానికి కారణం అగు ప్రకృతిగాని, వేరొకటి నాకంటె భిన్నమైనది ఈషన్మాత్రం లేదు. సృష్టి అనంతరం ఈ విశ్వం అంతా నేనే, ప్రళయానంతరం మిగులునది కూడా నేనే. ద్విచంద్రాదికంవలె లేని అర్థం భాసించుటకు, గ్రహమండలగతుడైన రాహువువలె ఉన్న అర్థం తోచకపోవుటకు కారణం నా మాయ అని తెలియును. మహాభూతాలు భౌతిక పదార్థాలయందు అప్రవిష్టాలైనను ప్రవిష్టాలై తోచుచున్నట్లు భూతభౌతిక పదార్థాలయందు నేను ఉంటిని. తత్త్వజిజ్ఞాసువగువాడు అన్వయ వ్యతిరేకాల చేత ఎల్ల చోట్ల ఎల్ల కాలాలలో ఏది ఉండునో అదియే, ఆత్మ స్వరూపమని తెలియును. అన్వయం అనగా కార్యాలయందు కారణం రూపంలో అనువర్తనం వ్యతిరేకం అనగా కారణావస్థయందు వానికంటె వ్యతిరేకంగా ఉండుట. ఇట్లే జాగ్రదాద్యవస్థాత్రయమందు సాక్షిరూపాన అనువర్తనం, సమాధ్యాదులయందు జాగ్రదాదులకంటె వ్యతిరేకంగా ఉండుట వ్యతిరేకం)

చతుశ్శ్లోక పరిమితమైన ఈ సంగ్రహ భాగవతాన్ని బ్రహ్మ నారదునకు, అతడు వ్యాసునికి, ఉపదేశించిరట. ఈ శ్లోకాలను బట్టిచూడ భాగవతం అద్వైత సిద్ధాంతాన్ని ప్రబోధిస్తున్నదని చెప్పవచ్చు, అద్వైతతత్త్వంసత్యం. అదియే ఏకమై అద్వితీయుమైన పరమాత్మ అగును. ఆ పరమాత్మను జ్ఞానులు బ్రహ్మం అనియు, యోగులు పరమాత్మ అనియు, భక్తులు భగవంతుడనియు నామకరణం ఒనర్చి పిలుస్తున్నారు. ఆ బ్రహ్మం సత్త్వగుణ స్వరూపియై అవచ్ఛిన్నుడు గాక అవ్యక్తుడై నిరాకారంలో ఉన్నప్పుడు నిర్గుణుడు అనబడును. అవచ్ఛిన్నుడైనపుడు సగుణుడు అని వ్యవహరింపబడును. అతడే భగవంతుడైన వాసుదేవుడు. ఆ నిర్గుణ పరబ్రహ్మమే బ్రహ్మ, విష్ణు రుద్ర భేదాలతో రూపధారణం ఒనర్చి సృష్టి స్థితి లయలకు కారణభూతుడు అగుచున్నాడు. జగద్వ్యాపారాదులకై యీ పరబ్రహ్మం భిన్న భిన్న అవతారాలు ఎత్తుచున్నది, అందు మొదటి అవతారం పురుషుడు. ఇతని నుండి పురుష, కౌమార, వరాహ, నారద, నరనారాయణ, కపిల, దత్తాత్రేయ, సుయజ్ఞ, ఋషభ, పృథు, మత్స్య, కూర్మ, ధన్వంతరి, మోహిని, నరసింహ, వామన, పరశురామ, శ్రీరామ, వ్యాస, బలరామ, శ్రీకృష్ణ, బుద్ధ, కల్కి, హంస, హయగ్రీవ, నారాయణ (గజేంద్ర మోక్ష కారకమైంది) అను 21 అవతారాలు ఉదయించాయి. భాగవతం యీ అవతారా

లన్నింటిని ప్రశంసించినను ప్రధానంగా శ్రీకృష్ణపరమాత్మకే ప్రత్యేకస్థానం ఒసగి ప్రస్తుతించింది.

భాగవతానికి సాత్త్వత సంహిత, మోక్షశాస్త్రం అనియు పేర్లుకలవు.

"అనర్థోపశమం సాక్షాద్భక్తియోగమధోక్షజే।
లోకస్యాజానతో విద్వాంశ్చక్రే సాత్త్వతసంహితామ్ ॥

(అనర్థ నివారణోపాయము భగవంతునియందలి భక్తియోగాన్ని సాత్వత సంహితా రూపంలో విద్వాంసుడు అజ్ఞానిఅగు లోకం కొరకు నిర్మించెను)అని భాగవత వాక్యం.

"తస్మాదేకేన మనసా భగవాన్ సాత్త్వతాం పతిః।
శ్రోతవ్యః కీర్తితవ్యశ్చ ధ్యేయః పూజ్యశ్చనిత్యశః॥"

(అందువలన ఏకచిత్తంతో భగవంతుడు నిత్యం శ్రవణం చేయతగినవాడు, ధ్యానింపతగినవాడు, కీర్తింపతగిన వాడు, పూజింపతగినవాడు)

అని భగవంతుడు భాగవతంలో సాత్త్వతపతిగ పేర్కొనబడినాడు. సత్ శబ్దానికి సత్త్వమూర్తియగు భగవానుడనియు, ఆయనను ఉపాసించేవారు సత్త్వంతులు లేక భక్తులు అనియు, సత్త్వంతులను ఉద్ధరించువాడగుటచేత సాత్త్వతపతి అనియు, దీనికి శ్రీధరపండితులు ఇట్లు వ్యాఖ్యానం ఒనర్చి ఉన్నారు.

"సచ్ఛబ్దేన సత్త్వమూర్తిర్భగవానభిధీయతే స ఉపాస్యతయా విద్యతే యేషామితి సత్త్వంతో భక్తాః తతః స్వార్థేఽణ్ । రాక్షసవాయసాదివత్ తస్య చాశ్రవణ పూర్వం తదేవం సాత్త్వత ఇతి భవతి తేషాం పతిః పాలకః॥"

భాగవతంలో సాత్త్వత శబ్దానికి పర్యాయంగా భాగవత శబ్దం అనేక స్థలాలలో వాడబడింది. సాత్త్వత శబ్దం కన్న భాగవత శబ్దమే అధిక ప్రచారం పొందియున్నది అనుట నిర్వివాదం.

భాగవత మనసేమి ?

భాగవత శబ్దాన్ని పెద్దలిట్లు నిర్వచించారు. "భగవతః ఇమే భాగవతాః భక్తాః" - (భగవంతుని, సొమ్మగువారు భాగవతులు - వారినిగూర్చి చెప్పేది భాగవతం.) "భగవాన్ యేషాం దేవతా భాగవతాః" - (భగవంతుడు ఎవరికి దేవతయో వారు భాగవతులు, అనగా భక్తులు, వారికి సంబంధించిన గాథలను తెల్పేది భాగవతం.) "భగవతః ఇదం భాగవతం" - (భగవంతుని గుణగణాలను నిరూపించుటకై, జన్మించింది భాగవతం)వీనినిబట్టిచూడ భగవంతునిగూర్చియు, అతని భక్తులను గూర్చియు తెల్పేది భాగవతం అని తెలుస్తావుంది, ఈ మహాగ్రంథంలోని గాథలు ఒక్కొక్కటి వెలువరించే విశిష్టాంశాల్ని వరుసగా పరిశీలిద్దాం. (సశేషం)

31-1-97 డి. నాగసిద్ధారెడ్డి,
తిరుపతి.

ఓమ్

# శ్రీమద్భాగవత శ్రవణ లాభములు



మహారాజు పరీక్షిత్తుడు యేడు దినాలు నిరశన దీక్షతో పవిత్ర గంగాతీరంలోవుండి సరసవక్తయగు శ్రీ శుకమహర్షి ముఖతః భాగవత కథాసుధను పానంచేశాడు. "ఆయన పొందిన ప్రయోజనాలేమిటి" అనే ప్రశ్నకు సమాధానంగా శ్రీ పాద సనాతన గోస్వామి తమ బృహత్ భాగవతామృతంలో చక్కగ వర్ణించారు. పరీక్షిత్తునికి భగవల్లీలారసామృతపానభాగ్యము లభించింది; అంతేకాక - క్రింద చెప్పిన అయిదు లాభాలు సిద్ధించాయి!

1. తక్షకుడు తన్ను కరుస్తాడనే భయము - సంసార వ్యామోహభయము నివృత్తమైంది.
2. అప్రయత్నంగా ధర్మార్థ కామమోక్షాలనే పురుషార్థాలు సులభమైనాయి.
2. శ్రీకృష్ణ పరమాత్ముని పాదారవిందప్రేమలో కరిగిపోయాడు.
4. శ్రీమద్భాగవతంలోని నిగూఢతత్త్వ రహస్యాలను తెలిసికొనే సదవకాశం లభించింది.
5. తక్షక దర్శనం తర్వాత భగవంతుని దివ్యధామాన్ని పొందగలిగాడు.



2. శాశ్వత చందాలు స్వీకరింపబడవు. క్రొత్తగా చందాదార్లుగా మధ్యలో చేరితే వారికి జనవరి నుండి వున్నపత్రికలు పంపబడును. మరొక ముఖ్యవిషయం పూర్వం శాశ్వత చందాదారుల్లో శాశ్వత చందా పెంచినా కట్టనివారు కొందరున్నారు. వారి గురించి 1996 ఫిబ్రవరిసంచిక రేపర్ 4 వ పేజీలో ప్రకటించాము. "96 నుండి వారి శాశ్వతచందాను ఎన్ని సంవత్సరాలు సంవత్సర చందాలుగా వస్తే అన్ని సంవత్సరాలు పత్రికలు పంపి తరువాత వారిని కూడా సంవత్సర చందా దార్లుగా చేర్చటం జరుగుతుంది" అని. కావున శాశ్వత చందాదార్లు అన్యథా భావింపరని మనవి. 96 సం॥ ఫిబ్రవరి సంచికలోనే పై విషయం తెల్పాము.

3. శుకవాణి ఈ సంవత్సరంతో 12 సం॥ పూర్తిచేసుకొంటుంది. 12 సం॥ రాలకు ఒక విశేషం వుంది. కావున ఈ సంవత్సరం శ్రీ గురుదేవుల జయంతికి ఆరాధనకు కొన్ని పేజీలు పెంచి డిసెంబర్‌సంచికను విశేషసంచికగా ప్రకటించవలసినందున M.O. ఫారంలో 40 రూ. వేసి పంపాము. జనవరి నెలలో కూడా పేజీలు పెంచాము- కావున చందాదార్లు పై విషయాన్ని గుర్తించి అన్యథా భావింపక వారివారి చందా 40 రూ. పంపవలెను. పత్రిక నడపటం సామాన్యంకాదు. ఒక్కొక్కసారి పేపర్‌ధర బాగా పెరుగుతుంది, అన్నీ అంతే. కావున చందా పెంచామని అన్యథా భావింపరాదు ప్రచారదృష్టితో పత్రిక నడుస్తుంది. కావున మా ప్రచారదృష్టికి చందాదార్లు తోడ్పడగలరని విశ్వసిస్తాము. ఓం

కార్యదర్శి.



News Paper Registration No. 44859/86
SUKAVANI Postal No, H/PD 7

# భాగవత పతనము

అన్తఃపురాంతరచరీ మనిహత్య బంధూన్
స్త్వాముద్వహే కథమితి ప్రవదామ్యుపాయం।
పూర్వేద్యురస్తి మహతీ కులదేవియాత్రా
యస్యాం బహిర్నవవధూర్గిరిజా ముపేయాత్ ॥

(సం. భా. 10-52-42)

'నీ అంతఃపురములో చరించు నీ బంధుజనమును చంపకుండా నిన్నుదెచ్చి పెండ్లియాడుటెట్లు' అనుసందేహము నీకు కలగవచ్చు. దానికొక ఉపాయముంది. పెండ్లినాటికి ముందటి దినము, ఊరిబయటనున్న కులదేవి దర్శనమునకు మావారు యాత్ర (మెరవణి) చేయుదురు. గిరిజా దర్శనానికి నవవధువును కూడా కొనిపోదురు. —: పోతన పద్యము :—

సీ॥. లోపలి సౌధంబులోన వర్తింపంగ
  దేవచ్చునే నిన్నుఁదెత్తునేని
గావలి వారలఁగల బంధువుల జంపి
  కాని తేరాదని కమలనయన!
భావించితేని నుపాయంబు చెప్పెద
  నాలింపు కులదేవ యాత్రఁజేసి
నగరంబు వెలువడి నగజాతకును మ్రొక్క
  బెండ్లికి మునుపడఁ బెండ్లికూతు.
తే॥ నెలమి మావారు పంపుదు రేను నట్లు
పురము వెలువడి యేతెంచి భూతనాథు
సతికి మ్రొక్కంగ నీవు నా సమయమునకు
వచ్చి కొనిపొమ్ము నన్ను నవార్యచరిత.(ఆ.భా.10స్క 1707)

Published by Matha Pratibhanandagiri Sri Bhoomananda Ashram V. G. Palle, P. O. Cuddapah-Dt. 516 329
Phone Vempalle S. T. D. No. 08562 - 81250.
Printed at Sri Balaji Press, Gandhi Road, Chittoor (A.P)